పింగళి సూరన, 16th Cent

రాఘవపాండవీయం

చెన్నపురి, 1895

Record no. 365

Piṅgaḷi Sūrana, 16th Cent

Rāghavapāṇḍavīyaṃ

Cennapuri, 1895

Record no. 365

## Bibliographic Record Target

పింగళి సూరన, 16th Cent.

రాఘవపాండవీయం / పింగళి సూరయాఖ్యకవిచే విరచితము.- చెన్నపురి : ఆదివిద్యాతరంగణిముద్రాక్షరశాల, 1895.

239 p. :ill. ;20 cm.

Record no. 365

Piṅgaḷi Sūrana, 16th Cent.

Rāghavapāṇḍavīyam / Piṅghaḷi Sūrayākhyakavicē viracitamu.- Cennapuri : Ādividyātaraṅghaṇimudrākṣaraśāla, 1895.

239 p. :ill. ;20 cm.

Record no. 365

శ్రీరస్తు.

నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ
పింగళి-సూరయాఖ్యకవిచే విరచితంబగు

# రాఘవపాండవీయము.

నందవరకులక్షీరపారావార రాకాసుధాధామ
ముద్దరాజు ॥ గణపయామాత్యపుత్ర పెదరామధీమణి ప్రణీతంబగు
రాఘవపాండవీయ దర్పణంబను టీకాసహితంబుగనుండు

నియ్యది,

శ్రీమాన్.భ.తి.పంచాంగం-నరశింహాచార్యులవారిచే,
పరిష్కరింపంబడి.

రాయపురము మన్నార్సామి గుడి వీధి డో నెం ౧౦౯
గల, గృహమునందు స్థాపించియుండు.

బెంగుళూర్.
రత్ననాయకర్.
స్వకీయ.
ఆదివిద్యాతరంగిణిముద్రాక్షరశాల
యందుముద్రింపించి
ప్రచురింపబడియె.
చెన్నపురి.

౧౮౯౪, సం॥



శ్రీహయగ్రీవాయనమః

30610

# రాఘవపాండవీయము - సవ్యాఖ్యానము - ప్రథమాశ్వాసము.

౧. శా. శ్రీతోఁబుట్టినసుధామధుద్రవముతోఁ జెన్నొందుపుష్పం
బుశోఁ । భాతారుణ్యమెలర్పఁగా ముడుచు పంపాహేమ
కూటాశ్రయ। ఖ్యాతబ్రహ్మము ప్రోచుఁగావుతవిరూపా
క్షాహ్వయంబాకువీ । టీతిమ్మప్రభు వేంకటాద్రిహృద
యాటీకంబులోకంబులన్ ॥

టీక॥ శ్రీతోన్, లక్ష్మితోడ - పుట్టి - జనించి - సుధామధుద్రవముతోన్ - సుధా - అమృతమనెడి - మధు - పూదేనెయొక్క - ద్రవముతోన్ - తడితోడ, చెన్నొందుపుష్పంబు - చెన్నొందు - ప్రకాశించునట్టి, పుష్పంబు - పువ్వును - శోభాతారుణ్యము - తరుణకాంతి - ఎలర్పఁగాన్ - ఒప్పగా - ముడుచుపంపాహేమకూటాశ్రయఖ్యాతబ్రహ్మము - ముడుచు - జడలయందుఁ దాల్చుకొన్నట్టి - పంపా - పంపా - సరస్తీరమందున్న - హేమకూట - హేమకూటపర్వతమనెడు - ఆశ్రయ - ఉనికియందు - ఖ్యాత, పేరొందినట్టి - బ్రహ్మము - కతన్ - అనఁగా బాలచంద్రుని శిరమునందుఁ - దాల్చినదని భావము - విరూపాక్షాహ్వయంబు - విరూపాక్షనామముగలది - ఆకువీటితిమ్మప్రభు - ఆకువీడనుపత్తనమునకుతేఁడైన - తిమ్మ - తిమ్మరాజుకొమరుడయిన - వేంకటాద్రిప్రభు - పెదవేంకటాద్రిప్రభువుయొక్క - హృదయ - ఉల్లమునందు - ఆటీకంబు, వశించునది - బ్రహ్మశబ్దమునకువిశేషణములు - లోకంబులన్ - జనకోటులను - ప్రోచుగావుతన్ - రక్షించుగాత॥ ౧

౨. శా. శ్రీవక్షోండలురెండునండగొని వాసించేర్చుచున్భక్తిసా।
మీచీన్యామల పెద్దవేంకట నృపోన్మీలన్మనశ్చాతక। వ్యాచి
క్రింసకుఁగైవసంబయిసదోదంచత్కృపావృష్టిసధ్రీచీనం
బగుకృష్ణమేఘముజగత్ప్రీతింగడుంజేయుతన్॥

శ్రీ - లక్ష్మీదేవియొక్క - వక్షోండలు, స్తనములనెడుపర్వతములను - రెండున్ - రెంటిని - అండగొని, ఆశ్రయించి - వాసిన్ - అధిక్యముచేత - పేర్చుచున్ - ప్రసిద్ధికెక్కుచును - భక్తి - భక్తియొక్క - సామీచీన్య - కొమరుచేత - అనగా నిష్కలంకభక్తిచేననుట - అమల - వీపత్రుఁడయిన - పెద్దవేంకటనృప - పెదవేంకటాద్రిప్రభువుయొక్క - ఉన్మీలత్ - వికాసముపొందుచున్న - మనః - డెందమనెడి - చాతక - వానకోయిలయొక్క - వ్యాచిక్రింసకున్, గమనేచ్ఛకు, అనగా నుదకమును కోరిసంచరించుట - కైవసంబయి, అధీనమై, సదా, ఎల్లప్పుడు, ఉదంచత్, అడరుచున్న, కృపా, దయారసమనెడి, వృష్టి, వర్షముతోడ, సధ్రీచీనంబగు. కూడివర్తించునట్టి - కృష్ణమేఘము - కృష్ణుఁడనుకార్మొయిలుంగు - శ్లిష్టరూపకము - జగత్ - లోకముయొక్క - ప్రీతిన్ - ఇష్టమును - కడున్ - మిక్కిలి - చేయుతన్ - ఒనర్చుఁగాక॥

౮- వ॥ నిజాస్థానంబున సంగీత సాహిత్యాది వివిధవిద్యాప్రసంగం
బులం బ్రవర్తిల్లుచు! ❋

నిజ-తనయొక్క-ఆస్థానంబునన్-కొలువుకూటమునందు-సంగీత-గానము-సాహితీ
సాహిత్యము-ఆది-మొదలుగాఁగల- వివిధ- అనేకవిధములయిన-విద్యా-విద్యలయొక్క-
ప్రసంగంబులన్-ప్రసక్తులచేత-ప్రవర్తిల్లుచున్-ఉన్నవాఁడగుచు॥

౯- సీ- శోభితాపస్తంబసూత్రు గౌతమగోత్రు సుచరిత్రు బింగళసూ
రసుకవి పౌత్రు నన్నపరతిభావన దౌహిత్రు నమరధీమణికి
నబ్బమకుఁ బుత్రు। ననుజన్ము లైనట్టి యమలనయ్య మెఱనార్యుల
తిథ క్తిసేయఁగనలరువాని। సత్కావ్యరచనావిశారదుం,
డగువాని సూరననామవిశ్రుతు నన్ను। బ్రియము సంధిలం
గ బిలిపించి బహువస్త్ర। భూషణాది దానములఁ గరంబు।
సంతసంబొనర్చి మెంతయు గారవ। మెసగ మధురఫణితి
ట్టులనియె॥ ❋

శోభిత- ప్రకాశింపఁబడిన- ప్రసిద్ధినొందినదనుట- ఆపస్తంబసూత్రున్- ఆపస్తం
బమను సూత్రము గలవాని- గౌతమగోత్రున్- గౌతముల గోత్రము గలవాని, సుచరిత్రున్-
మంచినడత గలవాని-పింగళ సూరసుకవి పౌత్రున్- పింగళ సూరన్నకవియొక్క-మనమఁడై
నవాని-నన్నపరతిభావన నన్నపరతిభావనలకు - దౌహిత్రున్-కూతురుకొడుకై నవాని-అ
మరధీమణికిన్-అమరయ కవికిని-అబ్బమకున్-అబ్బమ్మకును-పుత్రున్-తనయుఁడైనవాని-అ
నుజన్ములైనట్టి-తమ్ములైన-అమలయ ఎఱనార్యులు-అమలన యెఱ్ఱనకవులు-భక్తిసేయఁగన్-
భక్తియొనర్పఁగా-అలరువానిన్-ఒప్పెడువాని- మహిమ జెందువాని యనుట-సత్కావ్య, మం
చికావ్యములయొక్క- అనఁగా దోషరహితములై రసాదిప్రయుక్తములైన వనుట-రచ
నా-కూర్పునందు- విశారదుండగువానిన్-నేర్పరియైనవాని-సూరననామ-సూరనయను
పేర-విశ్రుతునిన్-ప్రసిద్ధికెక్కినవాని-నన్నున్-నను-క్రిందటి వెల్ల దీనికి విశేషణములు-ప్రియ
ము-ప్రీతి-సంధిలంగన్-తనరఁగా-పిలిపించి-పిలువనంపి-బహు- అనేకములయిన-వస్త్ర-
చేలములు-భూషణ-సొమ్ములు-ఆది- ఇవి మొదలుగాఁగలవానియొక్క-దానములను-ఈవు
లచేత- కరంబున్-మిక్కిలి- సంతసంబొనర్చి-సంతోషపెట్టి ఎంతయున్-చాల.గార
వమెసగన్- ఘనత మీఱఁగా- మధురఫణితిన్-ఇంపగు తెఱఁగున-ఇట్టులు-ఈ మీఁద జెప్ప
బోయెడి ప్రకారమున-అనియెన్-పల్కెను॥ ❋

౧౦- శా- రెండర్థంబుల పద్యమొక్కటి యొనర్మింపంగ శక్యంబుగా।
కుండం దద్దతిఁ గావ్యమెల్లనగునే నోహోయనం జేయ
దే। పాండిత్యంబు వందునుం దెనుగు కబ్బం బద్భుతంబందు
చాతుండెవ్వాఁడు రామ భారతకథల్ జోడింపభాషాకృతిన్॥

రెండర్థంబుల పద్యము-ద్వ్యర్థియగు పద్యమును- ఒక్కటియున్- ఒండేని
నిర్మింపంగన్-కూర్చుటకు- శక్యంబుగాకుండున్ - తరముగాకుండును- అట్లుంగా



తద్గతిన్-ఆ రెండర్థములుగల పద్యము చొప్పున-కావ్యమెల్ల నగునే-ని-ఒక ప్రబంధము కడము
ట్టనిర్మితమాయెనేని-ఆ కావ్యము నుట సిద్ధార్థము-అది యకతన్- ఓహో యనం జేయదే-
ఆశ్చర్యపడి మెచ్చుకొనునట్లు చేయుజాలదా-పాండిత్యంబున సంపను- రెండర్థముల కావ్య
మును జేయునట్టియా నేర్పునందును- తెనుగుకబ్బములు-ఆంధ్రకావ్యములు ... ఆంధ్రకా
వ్యము చేతయనుట-అద్భుతంబం ద్రుము-అరుదందురు- పెద్దలకెవ్వ... ప్రాకృతి ... వా గ్రూప
మున. కావ్యస్వరూపముగ ననుట- రామభారతకథల్ - రామాయణ ... జోడిం
పన్-జంటించుటకు-అనఁగా నా రెండర్థములను నొకటి గా జెప్పుట ... యి ...
యందు- చతురుండు-సమర్థుఁడు- ఎవ్వాఁడు- ఏకవి - కలఁడని సేపము, కానక ... నీ కంటె
నెవఁడు లేఁడని భావము॥ ౧౦

౧౧- ఉ- భీమన తొల్లి చెప్పెనను పెద్దల మాటయె కానియందు నొం।
డేమియు నేడ నెప్పలుచు టెవ్వరుగానరటుండ నిం మానా।
నా మహిత ప్రబంధ రచనా ఘనవిశ్రుతి నీకు గల్గుట। న్నామ
దిఁ దద్వ్యయార్థకృతి నైపుణియుం గలదంచు నెంచెదన్॥ ❋

తొల్లి-మునుపు-భీమనయను కవి-రెండర్థముల కావ్యమునని తెచ్చుకొనునది - చెప్పె
ను-వచించెను-రచించెననుట, అను-అనునట్టి-పెద్దలమాటయె కాని వృద్ధుల వాక్యమె గాని
రెండర్థముల కావ్యము నొకటిని భీమన చేసినట్టు పెద్దలు వాడుకొనుచున్నారని భావము-అం
దున్-ఆ కావ్యము నందు-ఒండు-ఒకటి-ఏమియున్, యేదియు-ఒకపద్యమైనననుట-యే
యెడన్, ఎచ్చోటను-నిలుచుట-వర్తించుటను-ఎవ్వరును-యేవారును- కానరు-ఎరుగరు-
అటుండనిమ్ము-ఆవార్తయట్టుండని-ఇటనిది మునాదరోక్తి. ఇక నేమనఁగా- నానా-పెక్కు
లయి నమహిత-పూజ్యములయిన- ప్రబంధ-కావ్యములయొక్క-రచనా-ఒనర్పుచేత-ఘన-
అధికమయిన-విశ్రుతి-ఖ్యాతి- నీకు కల్గుటన్-లభించుట చేత-ఇది హేతువు తత్ క్రిందట జె
ప్పిన-ద్వ్యయార్థ- రెండర్థముల ప్రబంధముయొక్క-కృతి- కూర్పునందుగల-నైపుణి
యున్- నేర్పును-కలదంచు- నీకు గలదని- నామదిన్, నాహృదయమునందు, ఎంచెదన్,
తలఁచెదను- ౧౧

౧౨- క- చాటుప్రబంధరచనా। పాటవకలితుఁడవు శబ్దపరిచితియం
దున్। మేటివి దీనిం దెనుఁగున। ఁ బాటించి రచింపనీవ ప్రౌ
ఢుఁడవరయన్॥ ❋

చాటుప్రబంధ, సంఖ్యాకా సంఖ్యాకాది క్షుద్రప్రశస్తకృతులయొక్క - రచనా-
ఒనర్పునందుఁగల-పాటవ-నైపుణ్యముతోడ-కలితుఁడవు-కూడుకొన్నవాఁడవు-శబ్దపరిచితి
యందున్-శబ్దపరిజ్ఞానమునందును- సాహిత్యయందనుట- మేటి సమర్థుఁడవు-కావున- అర
యన్-విచారించి చూడఁగా-దీనిన్-ఈ రెండర్థముల కావ్యమును- తెనుఁగున్-ఆంధ్రమునం
దు-పాటించి-కైకొని-రచింపన్-ఒనర్చుటకు-నీవ-నీవె-ప్రౌఢుఁడవు, జాణవు. ౧౨

౧౩- ఉ- చతురత యింతగల్గి విశదంబుగ గాంచియు నీమదిన్ఫలా।
పేతఘనంబుగా నిదిపట్టన గొంకెద నీకు నోలలా। చే

క్షణభక్తిశీలగరిమంచుటయిష్టమకాదె శ్రీవిరూ। పాక్షున
కంకితంబుగ శుభార్థము రాఘవపాండవీయముఁ॥ ❋

టా॥ దక్షత- కౌశలము- ఇంతకల్మి - ఇంతమాత్రము కలిగియుండుటను విశదంబుగన్-తెల్లముగ- కాంచియున్- తెలిసియు- నీమదిన్- నీయుల్లమందు-ఫలాపేక్ష-ప్రయోజనాసక్తి- ఘనంబుగామిన్-గొప్పకాకపోవుటచేత- నీకుగృతిచెప్పి దానఫలమును బొందుట- గొప్పయనుబుద్ధిలేమి హేతువుచేతననిభావము - ఇదియిట్టిదన్-యీకృతిచేయుమనుటకు- కొంకెదను-జంకెదను- అటువలదుగాని- ఓలఱా క్షణభక్తిశీల-ఈశ్వరభక్తినిరతుఁడైనవాఁడా-ఇదిహేతుగర్భవిశేషణము-శ్రీవిరూపాక్షునకున్-విరూపాక్షస్వామికి-అంకితంబుగన్-పేర్కొనఁబడినదిగా-శ్రీవిరూపాక్షునిపేరసనుచు-శుభార్థము-మేలుగలుగుటకొఱకు-రాఘవపాండవీయముఁ- రాఘవపాండవీయమను గ్రంథమును-రచియించుట-ఒనర్చుట-నీకున్-నీకు-ఇష్టమెకాదె-అభీష్టమెకదా- ఫలాపేక్షచేసినర్పనిష్టములేనివాఁడవైనను-భగవదంకితముగ చేయనిచ్ఛగలవాఁడవు-కావున-శ్రీవిరూపాక్షునిపేర నీద్వయార్థకృతినొనర్పుమని తాత్పర్యము॥ ౧౩

౧౪- వ॥ అనిసవినయభక్తికంబులగు మధురభాషణంబులని జాభి
లాషంబు తెలుపం గఱింగించిన నేనునుందదీయంబులగు న
తిమాత్రగౌరవ సంభావనాది విశేషంబులచేతం బ్రీతచే
తస్కుఁడనై యునికిం జేసి శక్యాశక్య విచారంబు లేక
యంగీకార భంగితరంగితంబగు నంతరంగంబుతో నతని
నభివీక్షించి॥ ❋

అని-ఇట్లని-సవినయభక్తికంబులు - వినయభక్తిసహితములు- అగు- అగునట్టి-మధురభాషణంబులన్-తియ్యనిమాటలచే-నిజాభిలాషంబు తెలుపు-తనకోర్కి రీతిని-ఎఱింగించన్- తెలిపింపగను-తదీయంబులు-అతనివి-అగు-అగునట్టి- అతిమాత్రగౌరవ-ఎంతయు గౌరవముతోఁగూడిన-సంభావనావిశేషంబులచేతన్- వింతలగుమన్ననలచే-కృతకృత్యుండనై-పూనుకొన్నవాఁడనై-ఉనికిం జేసి-ఉండుటచేత - శక్యాశక్యవిచారంబు-కాదనుఁగాఁదగదనుచింత-లేక- అంగీకారభంగి - ఒప్పికోలువిధముచే - తరంగితంబగు-పొనుపబడినట్టి-అంతరంగంబుతోన్-చిత్తముతోన్-ఇట్లంటిని-ఈలాగునబల్కితిని॥ ౧౪

౧౫- ఉ- రాఘవపాండవీయకథరమ్యముగా నొకకావ్యసృష్టిచే
హాఘటియింపగావశమె యాంధ్రకవీంద్రులకైన బావక।
శ్లాఘనపూర్వకోక్తి యవిలంఘ్యముగావునఁ గోవిదాను
కం। పాఘనబుద్ధిఁజూపెదఁ జమత్కృతిమత్కృతిమత్కృ
తిత్వమున్॥ ❋

ఆంధ్రకవీంద్రులకయినన్-ఆంధ్రకవిశ్రేష్ఠులకేనియు - రాఘవపాండవీయకథ-రామాయణభారతములను-రమ్యముగాన్-ఒప్పిదముగా- ఒకకావ్యసృష్టిన్-ఒకప్రబంధనిర్మాణముచేత-అహా-ఔరా-ఆశ్చర్యవాచకము- ఘటియింపఁగాన్-కూర్చుటకు-వశమె-శక్యమా- రాఘవభారతార్థములు-రెండుకలిగియుండునట్లుగా-నొకకావ్యమునిర్మిం



పఁజూడునాయనుట-అట్లైనను, బావక, శ్లాఘనపూర్వక,పొగడుకోలుమున్నగాగల,ఉక్తి-మాట-అవిలంఘ్యము- దాటందగని కావునన్, ఆకారణముచేత-కోవిదవిద్వాంసులయొక్క.అనుకంపా- కరుణచేత అతిశయముబొందిన- బుద్ధిన్-మతిచేత-పండితోత్తములకృపాతిశయమువలన- నాబుద్ధి మహాకావ్యనిర్మాణమునందుజూపెక్కు కలిగెంగాని-మఱియొకటిఁగాదనుట-చమత్కృతిమత్-చమత్కారముగల,కృతిన్,ప్రబంధరచనయందు, మత్కృతిత్వమున్,నాకౌశలమును,చూపెదన్,కనుపఱిచెదను॥౧౫

౧౬- వ- అనిమఱియునతనిచేతననేక విధసత్కారసంభావనాసం
భృతసమ్మదుండనై ❋

అని, ఇట్లని, మఱియును, అతనిచేతన్- ఆపాదవేంకటాద్రిప్రభువుచేత. అనేకవిధ,నానాప్రకారములయిన, సత్కారసంభావనా, దానసమ్మానములచేత,సంభృత,వహింపఁబడిన,సమ్మదుండనై,సంతోషముగలవాఁడనై॥ ౧౬

౧౭. సీ. ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష యొకొకచోట
నొక్కొకచో। నుచితశబ్దశ్లేషయొకొకచోటనర్థ
శ్లేషయొకొకతఱినిముఖ్య। గౌణవృత్తిశ్లేష ఘటనయొ
కొకతఱిశబ్దార్థాన్వయము వేఱయగుచునునికి। శబ్దాన్వ
యవిభేదసంగతియొకొక్క తఱినియొకొకతఱిని
రెండు। మూఁడుఁగూడుటయునసముజ్జ్వలముగా।నాకు
దోఁచినగతిఁబెక్కుచోకలఁగర। రామభారత కథలుప
ర్యాయసృష్టిఁజూపుసుమతులకేర్పడవాచరింతు॥ ❋

ఒక్కొకచోటన్, ఒక్కొకయెడ, ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష, ఆంధ్రగీర్వాణములయొక్క,కూడికయుఁ,ఒక్కొక్కచోట,వుచిత, తగుమైన,శబ్దశ్లేష,శబ్దములకూడికయు, ఒక్కొక్కచోట,అర్థశ్లేష,అర్థములకూడికయు, ఒక్కొకతఱిన్,ఒక్కొక్కవేళ,ముఖ్యగౌణ,ప్రధానాప్రధానములైన,వృత్తి,ప్రవృత్తులుగల,శ్లేష,కూడికయొక్క,ఘటన-కూర్పును-ఒక్కొకతఱిని, అర్థాన్వయము,అర్థములచేరిక, వేఱయగుచున్ భిన్నమగుచును-వునికి-వుండుటయు- ఒక్కొక్క,తఱిని - శబ్దాన్వయ-శబ్దములచేర్పుటయొక్క,విభేదసంగతి, వేఱుపడుటయును, ఒక్కొక్కతఱిని,ఇని, ఈప్రకారముఁ జెప్పినశ్లేషములు- రెండుమూఁడు, రెండు లేక మూఁడుగాని,కూడుట, చేరుటయు,మఱియు,సముజ్జ్వలముగన్-ఒప్పునట్లుగాననుట-నాకున్-తోఁచినగతిన్- స్ఫురించునట్టివిధమున-పెక్కుపోకలు,పలుమార్గములు,అమరన్,విర్పడగా, రామభారతకథలు,భారతరామాయణములను,పర్యాయసృష్టిన్,పర్యాయక్రమమున,చూచుసుమతులకున్. పరికించునట్టి,మంతులకు,నేర్పడన్,రామభారతకథలు,వేరువేర నేర్పడునట్లు,ఆచరింతును,రచియింతును,కృతినని సంబంధము॥ ౧౭

క- ఒకకథవినిమెడితరివే। అోకకథపైసృష్టియిడిన నొకయర్థ
ముదో। పకపోవుగాననేకా। ర్థకావ్యమెట్లట్లవినగఁదగు
నొకటొకటిన్॥ ❋

ఒకకథ- ఒక్కకతను-వినియెడితఱిన్ - ఆకర్ణించువట్టివేళ-వేఱొకకథపై-మఱియొకకథమీఁద-దృష్టి యిడినన్-చూడ్కి నిలుపుచు-తలంపుంచినను-తలంపుంచినననుట-ఒకయర్థమును- ఒకయర్థమేనియు- తోఁపకపోవుఁగాన్-స్ఫురింపకపోనుగనుక- ఏకార్థకావ్యము ఒకయర్థముగలగ్రంథము-ఎట్లు-ఏప్రకారమో-అట్లు-ఆప్రకారమే- ఒకటొకటిన్-ఒక్కొక్కయర్థమునుగా- వినఁగఁగదగున్- ఆకర్ణింపవలయుఁ ౧౮

౧౯- గీ- ప్రభుసత్కారఋణమిందుఁ బాయుననియు । శ్రీవిరూపాక్షసేవావిశేషమనియు । సుజనులిందుగుణాంశంబుచూతురనియుఁ జలిపితినసాధ్యకృతికిట్లు సాహసంబు॥ *

ప్రభువు- పెదవేంకటాద్రిప్రభువుయొక్క- సత్కార- సమ్మానమనెడు-ఋణము అప్పు-ఇందున్-ఈకావ్యనిర్మాణమునందు-పాయుననుచున్-తీరుననుచును- శ్రీవిరూపాక్షువిరూపాక్షదేవునియొక్క-సేవా-భజనవలననైన-విశేషము-శ్రైష్ఠ్యమును-కలుగునని శేషము-అనియు-సుజనులు-పెద్దలు-ఇందున్-ఈకావ్యమునందు-గుణాంశంబు-మేలగుపట్టునే-చూతురనియున్-కాంతురనియు-ఆసాధ్య-నెఱవేఱఁదగని-కృతికిన్-ప్రబంధనిర్మాణమునకు-ఇట్లు-ఈలాగున-సాహసంబు- తెగువను-సలిపితిన్- చేసితిని-సలుపు-అనునీక్రియాపదమీరాఘవపాండవీయ-ప్రాచీనలిఖితప్రతులయందంతటఁ-జాదిగావ్రాయఁబడియున్నదిగాని- తదాదియనినిదానింగణచేయుటకాకరములేదు-ఇప్పటివాడుకసాదిగాఁగనుపడుచున్నయది॥ ౧౯

౨౦. వ. అనియిట్లుకృతోత్సాహుండనగుచునేతత్ప్రబంధారంభంబునకుఁ బ్రేరకుండైన సకలాంతర్యామి హేమకూటాధ్యక్షుండు శ్రీవిరూపాక్షుండు నిర్విఘ్నపరిసమాప్తిప్రచయగమనంబులకుం దానకలండతని సంకల్పానుసారంబుననెట్లుగావలయునట్లగుఁగాక నాకుభారంబేమియునుఁ గలంపునిశ్చింతుండనై కడంగిదీనికిఁ బ్రత్యక్షనియామకుండైన పెదవేంకటాద్రిమహీవల్లభువంశక్రమంబభివర్ణించెద ॥ *

అనియిట్లు- కృత- చేయఁబడిన- ఉత్సాహుండనగుచున్ - పూనికగలవాడనై ఏతత్ప్రబంధ-ఈకావ్యముయొక్క- నిబంధనారంభంబునకు-నిర్మాణప్రారంభమునకు-ప్రేరకుండైన-పురికొల్పువాఁడగునట్టి-సకలాంతర్యామి-సర్వజనహృదయాంతర్వర్తియైన-హేమకూటాధ్యక్షుండు- హేమకూటాచలేంద్రుడగు- శ్రీవిరూపాక్షస్వామియే-నిర్విఘ్న-చెఱువులేకుండునట్లు-పరిసమాప్తి- ముగియుటయొక్క-ప్రచయగమనంబులకున్ వేగిరపురాకలకు - అనగాఁ- విఘ్నములేకవేగముగియుటకు- తాన- తానె-శ్రీవిరూపాక్షుఁడేయనుట-కలండు-ఉన్నాఁడు- అతని-ఆవిరూపాక్షస్వామియొక్క-సంకల్పానుసారంబునన్-ఎన్నికవెంబడిని-ఎట్లు-ఏరీతి- కావలయున్ - కావలెనో-అట్లు-ఆరీతి-అగుంగాక-పో గాత-నాకు-భారంబు-బరువు-ఏమియునుతలంపునన్- ఏమియున్నదనుభావము చే-నిశ్చింతుండనై -వగపులేనివాఁడనై-కడంగి- యత్నపడిదీనికిన్- ఈప్రబంధనిర్మాణమునకు-ప్రత్యక్షఎదటనుండునట్టి నియామకుండు-కర్తైనవాఁడు-అయిన-పెదవేంకటాద్రిమహీవల్లభుని పెదవేంకటాద్రిప్రభువు-యొక్క- వంశ- కులముయొక్క-క్రమంబు-



వరుసను-అభివర్ణించెదన్-ఉగ్గడించెదను॥ ౨౦

౨౧. శా. శ్రీశోభాఘనుఁడిమ్మభూవరుడులక్ష్మీనాథకల్పద్రుమా । హాశాఖాఫలమైనవంశమున మూర్తామోదము న్బ్రోలెస । ర్వాశాపూరితకీర్తివాసనలతో నావిర్భవించెన్ధరి । త్రీశోత్తంసితభవ్యశాసనకళాహేతుప్రతాపాఢ్యుఁడై ॥ *

శ్రీశోభా-సంపద్విలాసముచేత-ఘనుడు, అధికుడయిన-యిమ్మభూవరుఁడు-ఇమ్మరాజు-లక్ష్మీనాథ-శ్రీమన్నారాయణుఁడనెడు- కల్పద్రు- కల్పవృక్షముయొక్క-బాహా-భుజములనెడు-శాఖా- కొమ్మలయందుఁగల-ఫలమైన- వంశమునన్-పండైనకులమునందు-ననగా, క్షత్రియకులమునందనుట- ధరిత్రీశ- రాజులచేత-ఉత్తంసిత-శిరోభూషణముగాఁజేయఁబడినదై-భవ్య-ఒప్పిదమునైన-యుక్తమైనదనుట-శాసనకళా-శిక్షావిధికి-హేతు-కారణమైనప్రతాప-పరాక్రమము చేత- ఆఢ్యుఁడై-సంపన్నుఁడయి-అతనిపరాక్రమమునకువెఱచి-రాజులందఱుతనయాజ్ఞనుశిరముచే- వహించుచుండిరి-అనఁగా-రాజులందఱతనికిలోఁబడిరనిభావము-మూర్తామోదముఁబోలెన్- మూర్తివంతమైనవాసనావిశేషమువలె-సర్వాశా-ఎల్లదిక్కులయందు- పూరిత- నిండింపఁబడిన-కీర్తి-యశమనెడు-వాసనలతోన్-గంధములతోడ-అవిర్భవించెను-జనించెను॥ ౨౧

౨౨. గీ. అకువీటిపురీశాసనాంకుఁడగుచు । సకలసంగ్రామకేళినిశ్శంకుఁడగుచు । ననిశపూజితశేషపర్యంకుఁడగుచు । నతఁడుసౌ పొందుయువతిమీనాంకుఁడగుచు॥ *

ఆకువీటిపురీశాసన-ఆకువీటిపుర- ప్రభువనెడు- అంకుఁడగుచున్-పేరుగలవాఁడగుచు-సకలసంగ్రామకేళి-సమస్తయుద్ధక్రీడలయందు- నిశ్శంకుఁడగుచున్-జంకులేనివాఁడగుచు-అనిశ-నిరంతరము-పూజిత- అర్చింపఁబడిన- శేషపర్యంకుఁడగుచున్-అనంతుఁడుశయ్యగాఁగలవిష్ణుమూర్తిగలవాఁడగుచు-యువతిమీనాంకుడగుచును-మానినీమన్మథుఁడగుచును-అతఁడు-ఆయిమ్మభూపతి-పొంపొందున్-యింపొందెను॥ ౨౨

౨౩. క. కౌండిన్యగోత్రజలధివి । ధుండాతఁడుగాంచె వరసుతున్ భావమహీమండలపతిఁగదనబలో । ద్దండునిలక్ష్మాంబయనెడుతనసతియందున్॥ *

కౌండిన్యగోత్రమనెడు- జలధి- సముద్రమునకు-విధుండు- చంద్రుడయిన-అతఁడు-ఆయిమ్మభూపతి లక్ష్మాంబయనెడుతనసతియందున్- తనభార్యయందు-కదనబలోద్దండునిన్- యుద్ధమునందతిబలిమిచేతభయంకరుఁడైనవాని - భావమహీమండలపతిన్-భావరాజును-వరసుతున్-శ్రేష్ఠుడైనపుత్రుఁనిగా-కాంచెన్-కనెను॥ ౨౩

౨౪. స్రగ్ధర ॥ ఆలక్ష్మాంబాకుమారుండమలయశుఁడు భావావనీశుండుసాధ్వింబ్రోలాంబన్బెండ్లియై యొప్పఁగని యొసుతున్ భూపరీరంభలీలాశిలస్థూలంభవిష్ణుస్థిరభుజబలలక్ష్మీవిశేషప్రియుక్తోద్వేలాశాదంతిశుండాపిలసనలఘిమానేశునిమ్మక్షితీశున్ ॥ *

ఆలక్ష్మాంబాకుమారుండు - ఆలక్ష్మకు పుత్రుఁడయిన- అమలయశుఁడు-నిర్మలకీర్తిగలవాఁడైన-భావానీశుండు-భావరాజు-సాధ్వికిన్-పతివ్రతయైన-పోలాంబన్-పోల్యమను పెండ్లియై-వివాహమయి-ఒప్పుగన్-తగునట్లుగా-భూ-భూదేవియొక్క-పరిరంభ కౌఁగిలింతయందుఁగల- భరామివహనమనుట-లీలా- వేడుకయే-శీల-స్వభావముగాఁగల స్థూలంభవిష్ణు-తోరముగాఁగల-వృద్ధిబొందుచున్నదనుట-స్థిర-నిక్కడమైన-భుజబల-బాహుబలముయొక్క-లక్ష్మీవిశేష-సమృద్ధ్యతిశయము చేత-ప్రయుక్త-ప్రయోగింపఁబడిన-కలుగఁజేయబడినదనుట-ఉద్వేలాశాదిగంతముఁ యందున్న దంతి-దంతావళవముయొక్క-తుండా-తుండములయొక్క-విలసన-విజృంభణమునకు అకైన-లఘిమా వేశున్-లఘుత్వప్రవేశముగలవాని - ఇమ్మక్షితీశున్ - ఇమ్మభూపతిని, సుతున్-పుత్రునిగా-కనియెన్-కాంచెను. ౨౪

౨౫. క ॥ రాజమహేంద్రవరాధిపు । రీజైత్రవి చిత్రమాలఁ బరిభావి

జితుఁడై । యాజిఘనుండా యిమ్మమ । హీజాని ప్రసిద్ధి

గాంచె నెంతయు మహిమన్ ॥ ❋

రాజమహేంద్రవరమనెడు. అధిపురి. పట్టణశ్రేష్ఠముయొక్క-జైత్ర- జయశీలమైన-విచిత్రములన్. వింతపనులచేత-పరిభావిజితుఁడై, ప్రకాశింపఁబడినవాఁడై, ఆజిఘనుండు,రణశూరుఁడయిన- ఆయిమ్మమహీజాని, ఆయిమ్మరాజు,ఎంతయు మహిమన్. మిక్కిలిప్రభావము చేత-ప్రసిద్ధి గాంచెన్-ప్రఖ్యాతిఁజెందెను॥ ౨౫

౨౬. తే-గీ. ఆమహీలోకవిభుని యర్ధాంగలక్ష్మి । యయినకసవ

మ్మయన సూయయగుట నార్యయగుట సుప్రసిద్ధమవే

రెయడుగనేల । వినుతికెక్కు పాతివ్రత్యవిలసనంబు॥ ❋

ఆమహీలోకవిభుని-ఆయిమ్మభూవరునియొక్క-అర్ధాంగలక్ష్మి-అర్ధశరీరలక్ష్మియైన-అయినట్టి-అనఁగాభార్యయయిన- కసవమ్మ. కసవాంబ- అనసూయ-అనసూయాదేవియు- అసూయ లేనిదియు- అగుటన్- అపుటచేతను. ఆర్య-పార్వతీదేవియు-కులీనయు-అగుటన్-అపుటచేతను- సుప్రసిద్ధము- తేటతెల్లమె- వినుతికెక్క-ప్రఖ్యాతినొందిన-పాతివ్రత్యవిలసనంబు-పతివ్రతామహిమను- వేరె- ప్రత్యేకముగా-అడుగనేల-విచారింపనేమిటికి॥ ౨౬

౨౭. క ॥ ఆయిమ్మడి ధాత్రీతల । నాయకునకు గసవమ కును నం

దనులధిక । శ్రీయుతులిద్దరుసుజనవి । ధేయులు బొమ్మప్ర

భుండు తిమ్మవిభుండున్ ॥ ❋

ఆయిమ్మడిధాత్రీతలనాయకునకున్-ఆయిమ్మభూపతికిని - కసవమకును - కనదంబకును-అధికశ్రీయుతులు-ఘనలక్ష్మీసమన్వితులు- సుజనవిధేయులు - సజ్జనులకడ్డగినవారు- బొమ్మప్రభుండు-బొమ్మరాజును-తిమ్మవిభుండును - తిమ్మరాజుననఁగా-ఇద్దరు-ఇరువురైన-నందనులు-సుతులు-కలరనిశేషము॥ ౨౭

వఁవార్థిలోన॥ టీ ॥ ఆయిరువురిలోపల॥

౨౮. ఉ॥ పావనమూర్తినై నిజయశ్శైరవసద్బిరుదాంకుఁడైదశా॥

శావనితాలలాటతటచందనచిత్రకభావభాగ్యశ । శ్రీవిభ

వాభిరాముఁడయి జృంభితదాన విహారుఁడైధరి । త్రీవల

యంబునన్నేలసెఁదిమ్మనృపాలుడుధర్మశీలుఁడై॥ ❋

పావనమూర్తియై-నిర్మలదేహుఁడై-సౌందర్యవంతుండైయనుట - విజయభైరవసద్బిరుదాంకుఁడై విజయభైరవుఁడను మేటిబిరుదుగలవాఁడై-దశ-పదియైన-ఆశా - దిక్కులనెడు-వనితా- కాంతలయొక్క-లలాటతట, అలికప్రదేశములయందుఁగల చందనచిత్రభావ, గంధపుబొట్టగుటను, బాగ్, పొందిన, యశశ్శ్రీవిభవ, కీర్తివైభవముచేత-అభిరాముఁడయి, ఒప్పినవాఁడై- అనగాశుభ్రకీర్తియెల్లదిశలవ్యాపించునని భావము-జృంభితదానవిహారుఁడై ప్రశస్తత్యాగపరుఁడయి-ధర్మశీలుఁడై-పుణ్యస్వభావుఁడయి-తిమ్మనృపాలుఁడు-తిమ్మరాజు ధరిత్రీవలయంబునన్-భూతలమునందు-వెలసెన్-ప్రకాశించెను॥ ౨౮

౨౯. క ॥ ఉభయకులసిద్ధిఁదనరెడు । నభినవగుణములఁ ప్రసిద్ధియ

గు తిమ్మాంబన్ । విభవమునఁ బెండ్లియాడెను త్రిభువనవి

భుఁడాకువీటితిమ్మవిభుఁడొగిన్ ॥ ❋

త్రిభువన, మూఁల్లోకములయందువ్యాపించిన, విభుఁడు, ప్రతాపముగల, ఆకువీటి, ఆకువీడను పట్టణమునకురాజైన, తిమ్మవిభుఁడు, తిమ్మరాజు, ఒగిన్ క్రమముగ నుభయః ప్రాప్తియందనుట, ఉభయకుల, పుట్టిన మెట్టిన యింటివారివంగసములయొక్క, సిద్ధిన్, నిక్కడచేత, తనరుడు, ఒప్పునట్టి, అభినవగుణములన్, క్రొత్తలైన సద్గుణములచేత- ప్రసిద్ధియగు, ప్రసిద్ధురాయిన, పాతివ్రత్యాదిసద్గుణమహిమచేతను, ఉభయకులోద్ధారకురాలయినదనుటతిమ్మాంబన్-తిమ్మమ్మను, విభవమునన్, వైభవమున-పెండ్లియాడెను- వివాహమయ్యెను॥ ౨౯

౩౦- చ- పటుబలశాలితిమ్మనరపాలుడుపుత్రులగాంచె విక్రమో।

ద్భటుఁ పెదవేంకటాద్రి బ్రతిపక్షహరుం జినవేంకటన్మరు।

ద్విటపిసమానఘను వేంకటరాయని భవ్యతేజు వేంకటవ

రదున్ బుధప్రణుతిన్ తిమ్మయందుఁబెంపుగన్ ॥ ❋

పటుబలశాలి. గట్టిబల్మిగల-తిమ్మనరపాలుఁడు-తిమ్మభూపతి - బుధప్రణుతిగాంచిన-పెద్దల స్తోత్రమునుబొందిన, తిమ్మమయందున్-తిమ్మాంబయందు-పెంపుగన్- వృద్ధిగా-విక్రమోద్భటున్-పరాక్రమోద్భటున్-పరాక్రమోద్దండుఁడైన-పెదవేంకటాద్రిన్ - పెదవేంకటాద్రియను నాతని-ప్రతిపక్షహరున్-శత్రుసంహారకుఁడయిన- చినవేంకటున్-చిన్నవేంకటాద్రియను నాతని-మరుద్విటపిసమాన-కల్పవృక్షముతోనీడయిన - దాన. ఈవిచేత-ఘనున్-గొప్పవాఁడైన - అనఁగాప్రసిద్ధిబొందిన- వేంకటరాయనిన్ - వేంకటాద్రియఁడను నాతని-భవ్యతేజున్-ప్రతాపశాలియైన- వేంకటవరదున్ వేంకటవరదుఁడను నాతనిని-ఈనలువురిని-పుత్రులన్-సుతులను-కాంచెన్-కనెను॥ ౩౦

టీక॥ వ - అందు-ఆనలువురియందు॥

౩౧. తే. గీ॥ అమరవరభూమిభృన్మస్తకములగ్రిందు । వరుదునిజ

పాదకటక సత్ప్రభ చేత । విమలధృతిఁ గేళవ ప్రాయు

మానవేలయు। వేంకటాద్రియయనఁబిన వేంకటాద్రి॥ *

అమరవరభూమిభృత్-దేవనగమైన మేరుపర్వతము యొక్క- మస్తకములన్ -శిఖరములను-క్రిందుపరుచు-తగ్గఁజేయుచున్న-నిజ-తనయొక్క - పాదకటక.నితంబప్రదేశములయొక్క-సత్ప్రౌఢిచేతన్-ఔన్నత్యముచేతననుట- మేరుపర్వతమునకంటె మించినదనితాత్పర్యము- అర్థాంతరము- అమరన్.ఒప్పగా.వరభూమిభృత్. రాజశ్రేష్ఠులయొక్క.మస్తకములన్.తలలను.క్రిందుగా జేయుచున్న,నంచకొనజేయుచున్నవనుట.నిజ.తనయొక్క-పాద-చరణములయందున్న-కటక. నూపురములచేతనైన. సత్ప్రౌఢిచేతన్ తచేకననుట.చినవేంకటాద్రియొక్కడుకడిమిచేబిరుదుగాఁజానములదాల్చినయందియలజూచి శత్రురాజులుమాటాడకతలలువంచుకొందురనితాత్పర్యము. విమలనిర్మలమైనధృతిన్-ధైర్యముచేతనను- కేశవ-వేంకటేశ్వరుని-ప్రాయణమునన్- ఉనికియగుటచేతను-చినవేంకటాద్రివేంకటేశ్వరుని నిరంతరభక్తిచే ధ్యానించుచుండుటవలన-వేంకటేశ్వరస్వామియఁజినవేంకటాద్రిహృదయమందేవాసముచేయుచుండెనని-తాత్పర్యము-అర్థాంతరమునందు- వేంకటాద్రియయన్-వేంకటాచలమేయనునట్లుగా-చినవేంకటాద్రిరాజు-వెలయున్-ఒప్పును॥ ౩౧

౩౨ - చ ॥ కుమయున మోఘవిక్రమముసద్వినయంబు ప్రతాపము
న్స్వరూ । పమునవికారభావమునుబ్రాభవశక్తియు నిత్య
దానశీలముఁదగ శౌక్కటొక్కటికలంకృతిఁ జేయుగఁదా
ల్చిశోభిలు। స్వికలతనాకువీటిపుర వేంకటరాయఁడతిప్ర
సిద్ధుఁడై॥ *

ఆకువీటిపుర-ఆకువీటిపట్టణమునకధిపతియయిన-వేంకటరాయఁడు-వేంకటరాయఁడనురాజు- కుమయున్-నయిరణము-అమోఘ-మొక్కవోని-విక్రమము-బీరమును-సద్వినయంబు-మంచినమ్రతను-ప్రతాపమును-వేఁడిమిని-సురూపమును-చక్కఁదనమును అవికారభావమును-వెక్కురుఁదనములేమిని-ప్రాభవశక్తియున్ దొరతనపుశీవిని-నిత్యవడతెగని-దానశీలము-ఈగినడకను-తగిన్-తగునట్లు-ఒక్కటి- ఒకగుణము-ఒక్కకిటిన్ మరియొకగుణమునకు-అలంకృతిన్।సింగారమును-చేయఁగన్-ఒనర్చునట్లుగా- ఒకటిచేనొకటిప్రకాశింప-గాననుటతాల్చి-ధరించి-అనఁగానిగుణములుకలవాఁడై-అతిప్రసిద్ధుడై ఇట్టిసద్గుణములుకలవాఁడుకనుక నేమిక్కిలిఖ్యాతిని జెందినాఁడనిసంబంధము-విమలతన్। నిష్కల్మషత్వముచేత- పాకృత్యములుచేయనివాఁడనుట-శోభిలున్-ప్రకాశించును॥ ౩౨

౩౩- క ॥ వేంకటవరదుఁడు వెలయుని । రంకు పిశెరణ సిరూఢప్ర
జ్ఞనురణని । శ్శంకితప్రాభవముననక । లంకితకీర్తిప్రతా
పలక్ష్ములమహిమ॥ *

వేంకటవరదుడు-వేంకటవరదరాజు-నిరంకుశ-అడ్డపాటుకని-వితరణ- త్యాగము-న ను-నిరూఢ-తీరుపుగల-ప్రజ్ఞను-బుద్ధిచేతను-రణ-కయ్యముచేత-నిశ్శంకిత_జంకిలేనిదిగా జేయ-బడిన-ప్రాభవమునన్-ఏలుబడిచేతను- అనఁగా- జక్కగాయుద్ధము చేయువాడనుట-అకలంకిత-కలంకములేనిదిగాఁజేయఁబడిన-కీర్తిప్రతాపలక్ష్ముల- పొగడ,వేడుములసిరులయొక్క-మహిమన్-ఎక్కువచేతను-వెలయున్-ప్రకాశించును॥ ౩౩



౩౪. సీ- ఇట్టి యన్వయ పరిశుద్ధి యింపుమీఱ । శ్రీవిరూపాక్ష
భక్తివిశేషవిమల । హృదయుఁడగుచు సంగీతసాహి
త్యనిత్య।సరసగోష్ఠివినోదైకనిరతుఁడగుచు॥ *

ఇది-ఈపూర్వోక్తమయినట్టి-అన్వయ-వంశముయొక్క-పరిశుద్ధి-గరగరిక -ఇంపుమీఱన్-ముద్దుచెంగగా- ఇదిసతిసప్తమి- శ్రీవిరూపాక్ష - శ్రీవిరూపాక్షస్వామియందుగల-భక్తివిశేష-భక్త్యతిశయముచేత-విమల-కసటువాసిన- హృదయుడగుచున్ - ఉల్లముగలవాఁడగుచును-సంగీత-పాటచేతను-సాహిత్య-చదువుచేతను-నిత్య-నిశ్చలములగు-సరసతెలివరులతోఁడనగు-గోష్ఠి - కూటువయందైన-వినోదైక- వేడుకయొకటనే - నిరతుడగుచున్-ఇచ్ఛకలవాడగుచును. కర్తృక్రియ ముందుపద్యమున॥ ౩౪

౩౫- క- వడిగలతనానగిని। గడిముడిపసఁబ్రాభవమునవిజయాన
గరిలో । గడునెన్న నేర్చఁగలమి । ల్నడకలపెద వేంకటా
ద్రినరవరుఁడొప్పున్॥ *

వడిగలతనానన్-శౌర్యముచేతను-ఈవిని- త్యాగముచేతను-విడిముడిపసన్-ధనసంపత్తిచేతను-ప్రాభవమునన్- ప్రభుత్వముచేతను-విజయనగరిలోన్-విజయనగరములో-కడున్-మిక్కిలి-ఎన్నన్-గణించుటకును-ఏర్చన్- ఇవియనియేర్పరించుటకును-కలకలిగినట్టి-తగినవనుట-మేల్నడకల- మేటివర్తనలుకల-పెదవేంకటాద్రినరవరుడు-పెదవేంకటాద్రిరాజు-ఒప్పున్-ప్రకాశించును॥ ౩౫

౩౬- చ-విదువకయాకువీటిపెదవేంకటభూపతిసత్ప్రతాపము।
గడుదెలుపైనకీర్తియుజగంబులనన్నిటిమించిముంచిన। నజ
లధిశయుండుసంతసిలునాడువిరాణ్మయ మూర్తికిప్పుడు
నవకుంకుమంబుతెలిపూవు పూజయునంచునా
త్మలోన్॥ *

ఆకువీటి-ఆకువీటిపట్టణప్రభువైన-పెదవేంకటభూపతి- పెద్దవేంకటాద్రిరాజుయొక్క-సత్ప్రతాపమున్-ఉజ్జ్వలమైనపరాక్రమమును-కీడు-మిక్కిలి-తెలుపైన-తెల్లనైనట్టి-కీర్తియున్-యశమును- ఈరెండుకర్తలు-జగంబులనన్నిటిన్ - లోకములనెల్లను-మించి,అతిక్రమించి,ముంచినన్,మునుగజేసినను - కీర్తిప్రతాపప్రవాహములజలప్రళయమువలెలోకములనెల్ల-ముంచెననుట-అబ్ధిశయుండు,సముద్రశాయియయిన నారాయణుడు ఇప్పుడు-ఈవేళ-నాడు,నా యొక్క-విరాణ్మయ,విరాడ్రూపమైన,మూర్తికిన్ - దేహమునకు-ప్రళయమున హరివిరాణ్మూర్తియయి సముద్రములోబవళించుట శాస్త్రసిద్ధమునవక్రొత్తయయిన-కుంకుమంబు-కుంకుమపుబూతయు-తెలి-తెల్లనైన-పూవుల - పుష్పములచేనయిన-పూజయున్-అర్చనయు-అబ్బెనంచున్-కలిగెననుచు - ఆత్మలోన్ - హృదయమున-సంతసిలున్-ఆనందించును॥ ౩౬

౩౭- ఉ- చేకొనియాకువీటిభంశ్రీపెద వేంకటుఁ జెందియాత్మలో
నేకలసద్గుణంబుమహిమెన్నద నేకలసద్గుణాప్తిచేఁ । గై

డు నేడఁబా। ల్పెసఁగిన ప్రథమాంతములపయిం గదిసి కడుం। బసనారుక చటతపలను। గసడదవల్ద్రోచివచ్చు కవిజనమిత్రా- అని యాంధ్రభాషాభూషణమందును॥ క॥ ప్రథమాంతవిభక్తులపైఁ। గధితములగు కచటతపలు గసడదవలగుం। బృథివి నవిగ జడదబలగుఁ బ్రథముపు న్నలుగగణాంతపదములమీఁదన నియనంతు నిఘంటమందును జెప్పిన లక్షణము వలన కవకారము నకువకారము రావలసినందుకుఁ దాతంభట్లుగారు కవిలోకచింతామణియందు॥ క॥ భిన్నపదప్రథమలపై। నున్న పకారంబు నత్వమొందును వెలుఁగన్। మున్ని జరూపము ప్రాసము। నన్నదరూపంబు దాల్చు నాలీకాక్షా॥ అని విశేషవిధులుగాఁ జెప్పిరి ॥ శా ॥ ఆవాలుంగను దోయియానను మొగంబాగుబ్బ పాలిండ్లవాం। పావేణీరుచియాతనూవిలసనంబా యొప్పలే జెప్పినన్। గైవాలంబుగుఁగాని యయ్యెడ శిరఃకంపంబుతోఁ గూడ నా। హో పుట్టింపదే పుష్పధన్వునకును అయ్యబ్జాక్షినీక్షించిన వనిపిల్లలమఱ్ఱివీరన గారి ప్రయోగమును॥ ఉ॥ భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగ దోడై నెవుట్టును త్తమ। జ్ఞానమని యివి మొదలయిన కవిత్రయము వారి ప్రయోగములును వ్రాసినందువలనఁ బ్రథమాంతముమీఁది పకారము నకువకారాదేశము ప్రాసస్థానమందు నిత్యముగా వచ్చును-యతిస్థానమందు రాదు-ఇతరత్రయేదైన జెప్పవచ్చునన్నట్టాయెను గనుక-వారణనగరి పురమతల్లి యని చెప్పవచ్చును-కాఁగానే-సూరపరాజుగారిమీఁదటి పద్యమందును విముఖితసమదాటోపారిపంక్తిరథుడని, రాఘునాథుండు జెప్పినారు-ప్రకృతము-తనర్చి ప్రకాశించినవాడై-అయోధ్య యుద్ధము చేయశక్యము గానిది-యోద్ధుమశక్యా - అయోధ్యాయనునర్థమందు-బుహులోర్ణ్యత్ తనుసూత్రము నణ్ప్రత్యయాంతము విడుపులుడుపఁ దెనుగగును శాక - అనగా-రాజ - దిగ్దేశరాజుల చేతనైన-నుతి-గనిన-రాజధాని-సింహాసనస్థలమైనది-వెలయును-క్రియ॥ ౧

౨, క- ఆపట్టణమేలెడి పృధి। వీపాలుఁడు భ్రుకుటిమాత్రవిముఖిత
సమదా। టోపారిపఙ్క్తిరథుఁడు। ద్దీపించునుదారనీతిధృ
తరాష్ట్రుఁడనన్॥ *

భా॥ భ్రుకుటిమాత్ర। బొమముడిచేతనే॥ ని॥ మాత్రం కార్త్స్న్యేవధారణే యని-ఆ. విముఖిత-పరాఙ్ముఖములుగా జేయఁబడిన-తత్కరోతి తణ్ణ్యాం తాత్కర్మణోక్తః - అని క్తప్రత్యయాంతము॥ శ్లో॥ సువర్ణదండైకసితాతపత్రితజ్వలత్ప్రతాపావళికీర్తిమండలః అని నైషధము- సమదాటోప - గర్వాతిశయముతో గూడిన - అరి - శత్రువులయొక్క-పంక్తి- శ్రేణులయొక్క- రథుడు - రథములుగలవాడు- విముఖితపదవిశేషణము-ఉదారనీతి-ఘనమైననీతిగలవాడు ॥ ని ॥ ఉదారో దాతృమహతోః-అని-అ-ధృతరాష్ట్రుడుద్దీపించును॥ తా॥ భ్రుకుటిమాత్రవిముఖితులైన సమదాటోపారులుగలవాడు పంక్తిరథుడు॥ ని॥ పంక్తిస్స్యాద్దశమచ్ఛందో దశసంఖ్యావళీషు చ-అని విశ్వనిఘంటు-ఉదారనీతిచేత-ధృత-ధరింపబడిత-రాష్ట్రుడు-దేశముగలవాడు-అనన్-అనగా-ఉద్దీపించును-క్రియ॥

౩, చ, తెలివినతిప్రగల్భుఁ డసదృగ్బలుఁ డాతఁడు భీష్మచాపకౌశల
మెసహాయమై యమరశత్రుల నేపడఁ బన్వ వలంతియై। నిలుక
డనే లెవిశ్వధరణిం దనమిత్రకులంబు వైభవో। జ్జ్వలతఁ దప
లిర్పఁ బౌరవసుసంతతి రాజుల కెల్లి హెచ్చుగన్॥

భా॥ అసదృగ్బలుడు - సరిలేనిబలముగలవాడు ॥ ని ॥ సదృక్షస్సదృక్షని



అతడు-దశరథుడు-భీష్మ-భయంకరమైన-చాపకౌశలము - వింటియందలినేర్పే - ధనుర్విద్యయనుట- సహాయమై-అమరశత్రులన్-అసురులను-ఏపడపన్ - గొంచెము పఱుచుచుండగా, వలంతియై- సమర్థుడై - తనయొక్క - మిత్రకులంబు - సూర్యకులము॥ ని ॥ ద్యుమణిస్తరణిర్మిత్రః-అని - ఆ॥ వైభవములయొక్క - ఉజ్జ్వలతన్ - ఆధిక్యముచేత, తత్ప్రత్యయాంతము- తలిర్పన్-ప్రకాశించునట్టుగా-పౌర, పపట్టణమువారియొక్క-వసు-ధనములయొక్క॥ ని॥ వసురత్నే ధనేపి చ యని- ఆ॥ సంతతి- సమూహము-రాజులకెల్ల-హెచ్చుగన్-అరుదగునట్టుగా-విశ్వధరణిన్-సమస్తభూమియని॥ ని ॥ విశ్వం కృత్స్నమశేషమ్మని-అ॥ నిలుకడన్, వంశపారంపర్యముగా - ఏలెను-రాజులయొక్క సంపదయనుట స్సిద్ధము- ఇది కావ్యార్థాపత్త్యలంకారము॥ శ్లో॥ కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే యని॥ భా॥ తెలివిన్-బుద్ధిచేత-అతిప్రగల్భుఁడు- అసదృగ్బలుఁడు-దృష్టిబలసహితుఁడు కానివాడు-ధృతరాష్ట్రుడు- భీష్మునియొక్క-చాపకౌశలమే సహాయమై యమరగా శత్రులను-ఏపడపన్-మట్టుపెట్టుటకు-వలంతియై, మిత్రకులంబు-బంధువులయొక్క కులము-తలిర్ప-పౌరవ-పూరునిసంబంధమైన - సుసంతతి- సత్కులమందుగల॥ ని॥ సంతతిర్గోత్రజననకులాని యని-అ॥ రాజులకెల్లన్-యయాతిభరతుఁడు మొదలయిన రాజులకందఱికిని-హెచ్చుగ-ఏలెను-క్రియ॥ ౩॥

౪ క. సుబలతనయగుణమహిమం। బ్రబలితనకు దారధర్మపా
లనలీలన్। సొబగొందివన్నదేఁగా। విబుధస్తుతుఁ డప్ర్వ
భుండు వెలసెన్ధరణిన్॥ *

భా॥ సుబలతనయ-గాంధారి-గుణ- సౌశీల్యాదిగుణములయొక్క - మహిమన్-మహిమచేత॥ క॥ వినుతద్వితీయసప్తమి। కిన్నికు జెమూఁడవవిభక్తికిని నిడఁగా నా। విన వింపు పుట్టుపట్టున-నను వెఱఁగి ప్రబంధము బయోంబుధిశయనా॥ అని, లోకచింతామణియందు ప్రబలితనకుడు దారధర్మ-స్మృత్యుక్తమైన భార్యాధర్మము యొక్క-పతివ్రతాచారముయొక్కయనుట॥ శ్లో॥ ఆర్తార్తే ముదితే హృష్టా ప్రోషితే మలినా కృశా। మృతే మ్రియేత యా నారీ సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా యని స్మృతి॥ ని॥ ధర్మః పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ యని-అ॥ పాలనలీలచేత॥ శ్లో॥ ప్రదిత్సతస్స్వం పితురంధమాత్మనో నిశమ్య భర్తారమగూఢ సన్మదా-అరుంధతీకీర్తిమసౌ నిరుంధతీ బబంధ పట్టేన దృశౌ పతివ్రతా యని బాలభారతమందును జెప్పియున్నదిగనుక॥ సొబగొంది, ఒప్పినదై, వన్నెదేఁగా॥ శ్లో॥ అనుమూలాం విమలాంగీం కుశలాం కులజాం సుశీలసంపన్నామ్। పఞ్చలకారాం భార్యాం పురుషః పుణ్యాధికో లభతే యని చెప్పుదురు-విబుధస్తుతుండు, పెద్దలచే స్తోత్రము చేయంబడినవాఁడు॥ ని॥ విబుధః పండితే దేవే యని-వి॥ అప్ర్వభుండు-ఆధృతరాష్ట్రుడు- వెలసెను॥ ౪॥

రా॥ సుబల-బలిమి॥ బహుప్రీహి-ఁదితల్ప్రత్యయాంతము- నయగుణమహిమచేతఁ బ్రబలియు-దానధర్మపాలనలీలచేత సొబగొందితనకువన్నెదేఁగా - ఈయర్థమున, సుబలత యనునది కర్తృపదము-విబుధ-దేవతలచేత - స్తుతుఁడు, అప్ర్వభుండు దశరథుండు-వెలసెను-అర్థాంతరము-సుబలతన్-బలిమిచేతను - అయనుగ్, భాగ్యలక్షణములయొక్క॥ ని॥ అయశ్శుభావహో విధిరని-అ॥ ని॥ సుఃప్రభా సేవద్వాదౌ మహార్థ్యే॥ సూదేవృక్షాదశేయని-వి॥ మహిమచేతఁ బ్రబలి, ఉదారధర్మపాలన- దుష్టనిగ్రహశిష్టానుగ్రహాదిధర్మములయొక్క-సంరక్షణము॥ న్యాసత్రంధోయుచ్చనియుచ్ప్రత్యయాంతముగ

౯-మ - తలఁపం జొప్పడియొప్పినప్పుడు తత్యదుజ్జైత్రయాత్రాస

ము । త్కాలికారింఖదసంఖ్య సంఖ్యజయవత్కంఖాణరిం

ఖావిశృం। ఖలసంఘాతధరాపరాగపటలాక్రాంతంబుమి

న్నేరన। ర్గళభేరీరవనిర్దళద్గగనరేఖాలేపపంకాకృతి ౯ ॥*

రా॥ భా॥ రెండర్థములకుసమానము, తత్, ఆరాజుయొక్క, ఉద్యత - ప్రకాశిం పుచున్న - జైత్రయాత్రయందు - సముత్కాలికా - అధికోత్కంఠచేత॥ ని॥ ఉత్కంఠోత్కాలికేసమేయని - అ*రింఖత్ - సంచరింపుచున్నవై, అసంఖ్యములైన - సంఖ్య - యుద్ధములయందు॥ ని॥ మృధమాస్కందనంసంఖ్యమని, అ * జయవత్, జయములుగలవియునైన - కంఖాణ - అశ్వవిశేషములయొక్క, రింఖా, గొరిసెలచేత - విశృంఖలమానట్టుగా - సంఘాత - త్రొక్కబడిన - ధరా - భూమియందుగల - పరాగ, ధూళియొక్క - పటములచేత ఆక్రాంతంబు, ఆక్రమింపబడినదైన - మిన్నేరు, ఆకాశగంగ - కర్తృపదము - అనర్గళములైన భేరీరవములచేత, నిర్దళత్ - పగులుచున్న - గగన - ఆకాశముయొక్క, రేఖా, చీటికెలకు, ఆలేపార్థమైన - పంక, బురదయొక్క - ఆకృతిన్ - సామ్యముచేత - తలపన్ - ఊహించుటచొప్పడి - యుక్తమై - ఒప్పెను॥ శ్లో॥ సంబంధాతిశక్తియోన్సన్యదయోగేయోగకల్పనమ్సాధాగ్రాణిపురస్యాస్యస్యప్రశంతిఃఖమండలమనిసంబంధాతిశయోక్త్యలంకారము॥ ౯॥

౧౦- చ - తురగఖురాహతక్షితిజధూళిచయస్థగితాంబరంబుతో।

నారయుచుంటచ్చమాగజనముత్కరమప్పుడు చూడనొ

ప్పెది। కరివరయూథమత్సరవిగాఢతఁ జేసిసమస్తమైన

యి । ద్ధరదనపైకినెత్తుకొనితాల్చెడి నోయనుచుండఁ జూ

పరుల్ ॥ *

భా॥ రా॥ రెంటికిసమము - సులభము

౧౧- మ॥ జవవద్ఘోటకపాటితక్షితిరజస్సంక్రాంతిచేనింకిసిం। ధువు

లంగ్రమ్మఱనుర్వికిన్దివికిఁదోడ్తోనించెనన్నాగముల్ । నవ

నిర్యన్మదనిర్ఝరౌఘమునశుండాశీకరోర్ధ్వప్రవ। ర్షవిధిం దా

ననుజేసిసింధురములన్ప్రఖ్యాతి గాంచెంగరుల్ ॥ *

రా॥ భా॥ రెంటికిసమము, ఇంకు, ఇంకెడు, సింధువులన్ - సముద్రములను - ఆకాశగంగను॥ ని॥ దేశేనదవిశేషేభ్యౌ సింధుర్నాసరితిస్త్రియామ్, అని, ఆసేనాధూళిసర్వత్రవ్యాపించియాకాశగంగను సముద్రములనునింకించె ననియతిశయోక్తి - తన్నాగముల్ ఆసేనాగజములు, నవనిర్యన్మదనిర్ఝరౌఘములచేతను॥ ని॥ ప్రవాహోనిర్ఝరః - అని - ఆ॥ ని॥ ఓఘోబృందేంభసాంరయేయని - అ*శుండా, తొండములయొక్క॥ ని॥ శుండాతుబలహస్తిన్యాంకుదిరాకరిహస్తయోః, అని, వి*శీకర - జలకణములయొక్క, ఊర్ధ్వ - ప్రవర్షవిధిన్ - పొడవుగాజల్లుటచేతను, పుర్వికిన్, భూమికిని, దివికిన్, ఆకాశమునకును - కర్మాలంకారము ॥ క ॥ ద్వ్యర్థశబ్దమునకుదివియను ఘూర్శబ్దంబునకుభువియుమానగవలయున్, నౌశబ్దమునావయను న్యూనసిత రాజన్వపంబు దాజన జల్లుననితారంభట్లు, క్రమ్మ



యున్ । నౌశబ్దమునావయగు - న్యూనసితరాజన్వపంబురాజన జెల్లుననియరంభట్లు - క్రమ్మఱన్ - తిరుగ - నించెను॥ క॥ స్థావరతిర్యక్ప్రభృతుల। కేవరపునగ్రియలుదలవనేకవచనము ల్ । దేవమనుష్యాదిక్రియ। భావింపగనేకవచనబహువచనంబౌననికేతన - దానను జేసి - అటుకనుకనే - సింధురములు - సింధూన్ రాంతిదదతీతిసింధురాః - రాదానేయనుధాతువు - ఈయర్థమునుగలసింధురములనెడిప్రఖ్యాతినిగరులుగాంచెను - నిరుక్త్యలంకారము॥ శ్లో॥ నిరుక్తిర్యోగతోనామ్నామన్యార్థత్వప్రకల్పనమ్। ఈదృశైశ్చరితైర్జానేసత్యందోషాకరోభవాన్ - అని - చం॥ ౧౧॥

౧౨ - సీ - గంభీరవేదిలక్షణలక్షితంబులైతనరారు భద్రదంతావళ

ములు। నారట్టసింధుగాంధారాదిభవములైకొలువుశ్రీవృ

క్షకీఘోటకములు । పదునాల్గుజాతులంద్రిదశకాంతలమీ

రుపద్మినీజాతిసౌభాగ్యవతులు। కడుశుద్ధ్భశములైన కనక

రత్నాంశుకచందనాదిసుస్తుపంపదలును । సఖలదిగ్దేశ

భూపసమర్పితంబులగుచునరణంబు గతిఁదోన యరుగుదే

రఁ ననువరి చుజయశ్రీఁగొనుచు నతఁడు పురికిజనస్తాం

పువాగగోచరతబ్బఁగ॥ *

భా॥ రా॥ రెండర్థములకుసమము - గంభీరవేదులనెడుగజవిశేషములయొక్కలక్షణములచేత - లక్షితంబులై - కనుపట్టినవై॥ శ్లో॥ త్వగ్ఛేదాచ్ఛోణితస్రావాన్మాంసస్యదళనాదపి ఆత్మానంయోనజానాతితస్యగంభీరవేదితాయనిమృగచర్మయమందును॥ శ్లో॥ చిరకాలేనయోవేత్తిశిక్షాంపరిచితామపి। గంభీరవేదిర్విజ్ఞేయస్సగజోగజవేదిభిః - అనిరాజపుత్రీయమునందునుఁజెప్పియున్నది* తనరారు - ఒనర్పుచున్న - భద్రదంతావళములు - పట్టపుటేనుఁగులును - ఆరట్టసింధుగాంధారాదిభవములై - కొలువు - చెలఁగుచున్న - ఈదేశములయశ్వములుత్తమములుగనుక - శ్రీవృక్షకీఘోటకములు। శ్లో॥ వక్షోభవావర్తచతుష్టయంచ కంఠేభవేద్యస్యచరోచమానః। శ్రీవృక్షకీనామహయస్సభర్తుఃపుత్రప్రపౌత్రాభివివృద్ధయేస్యాత్తనిహయలీలావతి॥ ని॥ శ్రీవృక్షకీవక్షసిచేద్రోమావర్తోముఖేపిచయఃవైజయంతిని ఘుంటువు - పదునాల్గుజాతులన్ - బ్రహ్మ - క్షత్రియ - వైశ్య - శూద్ర - వ్యావహారిక - గోరక్షక - శిల్పకపంచాహీన - కుంభకార - తంతువాయ - క్షౌరక - రజక - వస్త్రచ్ఛేదక, చర్మకర - తిలఘాత - లుబ్ధక - చండాల - మాతంగులనెడుపదునెనిమిదిజాతులందు - బ్రాహ్మణజాతియునక్షత్రబాహ్యలయినలుబ్ధకచండాలమాతంగజాతులును - పినాకడమపదునాలుగుజాతులయందును - త్రిదశకాంతలమీరుచున్న - పద్మినీజాతిసౌభాగ్యవతులును - పద్మినీజాతిలక్షణమురతిరహస్యమందు॥ శ్లో॥ కమలముకుళమృద్వీఫుల్లరాజీవగంధిః సురతపయనీయస్యాస్సౌరభందివ్య

